# తాంబూలం



గురుసహస్రావధాని

డా॥ కడిమిళ్ళ వరప్రసాద్

# ప్రేమ తాంబూలం

మహిత 'పృథ్వీజిగీషల' మనసులందు
ధర్మపృథ్వీజిగీష సంతతము నిలిచి
ప్రేమ'తాంబూల' చర్వణ కాములగుచు
పుత్రపౌత్రాభివృద్ధికి బాత్రులగుత ॥



తాంబూలం

గురుసహస్రావధాని

డా. కడిమిళ్ళ వరప్రసాద్

ప్రథమ ముద్రణ : జూలై 1995
ప్రతులు : 1000
ద్వితీయ ముద్రణ : జనవరి 2015
ప్రతులు : 1000

ప్రతులకు:-
కడిమిళ్ళ రమేష్
3-6-50, యఋ్ఱమిల్లివారి వీధి
నరసాపురం. 534275
పశ్చిమగోదావరి జిల్లా
స్థిరవాణి : 08814274876
చరవాణి : 9247879606

మూల్యం:- రూ 30/

ముఖచిత్రం & ముద్రణ:-
క్రియేటివ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
స్టీమర్ రోడ్, నరసాపురం.
స్థిరవాణి : 08814273113
చరవాణి : 9866115113

# అంకితం

**శిరిగినీడి నారాయణస్వామి వెంకాయమ్మ పుణ్యదంపతులకు**

పలికెనా ఒక మంచి పల్కు పల్కుట దక్క
పొల్లు మాటాడిన పూట లేదు
చేసెనా ఒక మంచి చేత చేయుట దక్క
నిరుపయోగక్రియా సరణి లేదు
ఇచ్చెనా తన చేతికెముక లేకుంటయే
గాని వెన్కాడిన క్షణము లేదు
పట్టెనా నాగటిన్ పైడి పండుట దక్క
క్షామమేర్పడినట్టి జాడ లేదు
అతడు నారాయణస్వామి యతని గృహిణి
తగిన జోడు వెంకాయమ్మ ధర్మచరిత
ఆర్ష సంప్రదాయానుగ అన్నదాత్రి
అట్టి దంపతికీ పొత్తమంకితమ్ము॥

వారల సంతానమ్మై వారి గుణమ్ములకు నునికి పట్టై పురిలో
నీరుజ జయశంఖమ్మును బూరించి వెలుంగు నాగభూషణుడౌరా!

శిరిగినీడి కులాబ్ధికి శీతకరుడు పేదసాదల యెదలందు వెలుగువాడు
పంటవలతికి నంజలి పట్టువాడు ప్రకట తాంబూల రాజపోషకుడు నాడు॥

వ్యవసాయము, సద్రచనా వ్యవసాయము, నాడి వాడి పట్టెడి వైద్య
వ్యవసాయము, పరిపాలన సవన వ్యవసాయమునకు జాణ యతండే॥

సరస సంభాషణమునందు జక్రవర్తి మంచి నెంచెడివాడు మన్నించువాడు
మందహాసమ్ము మోమున మసలువాడు పూతచరితుడు మా నాగభూషణుండు॥

ఆతని చేతివాసి యమృతాంధస వైద్యునకేని యబ్బురం
బాతని లక్ష్యశుద్ధికనిలాత్మజుడే వెఱగొందుచుండు న
య్యాతని జ్ఞానతృష్ణకు బృహస్పతియే విసుమానమందుచుం
డాతడు నాగభూషణుడహంకృతి దూరుడు ప్రేమసారుడున్॥

# పరిమళం

శతావధానిగా లబ్ధ ప్రతిష్ఠులైన శ్రీ కడిమిళ్ళ వరప్రసాదుగారు మిత్ర సముద్రులు. ఎప్పుడూ పదిమంది మిత్రులతో సాహితీగోష్ఠితో, సరస సల్లాపాలతో చిలుకలు వ్రాలిన చెట్టులాగా ఉంటారాయన. ఉన్నంతలో నిశ్చింతగా హాయిగా బ్రతికెయ్యడం ఆయన ఫిలాసఫీ. నిజంగా అది ఎంత అదృష్టం.

సమాజాన్ని సునిశితంగా పరిశీలిస్తూనే హాస్యాన్ని మిళాయించడం మానుమందు పూసిన కత్తితో దుష్టాంగాన్ని ఖండించడం కవిగా కడిమిళ్ళవారి ప్రత్యేకత. అదే ఈ సామిశతకంలోనూ (పోనీ నేమశతకం అంటాను) కనిపిస్తోంది. మాది లంచాలజాతి అనే మకుటం ఎలాగూ కుదిరింది. మరో ఏభై సీసాలు లాగించేసి ఉంటే ఈ నిషేధపు గొడ్డురోజులలో అదొక అందంగా సాహసంగా ఉండేది. పోనీలెండి. ప్రస్తుతానికి ఈ యాభై సీసాలతో సంతృప్తి చెందుదాం.

మనిషి పుట్టినప్పటినుండి గిట్టేదాకా ప్రతిసందర్భంలోనూ గిట్టుబాటుకోసం చెయ్యి చాపడం ఇందులో కళ్ళకు కట్టించారు. బళ్ళోకెళ్ళడానికి లంచం. గుళ్ళోకెళ్ళడానికి లంచం. చివరికి కాటికి పోతే అక్కడా లంచమే. ఇందుగలదందు లేదను సందేహము వలదు లంచం సర్వోపగతం. దాని విశ్వరూపాన్ని సులభంగా పట్టుకొని ఆశుధోరణిలో కూర్చిన లఘుకావ్యం ఇది. ఆధునిక వస్తువునీ, ఆధునిక శైలినీ జతపరచి పద్యవిద్యకు విస్తృతిని పెంచి, దానిమీద ఉన్న ఒకానొక ఆక్షేపణను తొలగిస్తున్నందుకు శ్రీ కడిమిళ్ళవారిని ముమ్మారు అభినందిస్తూ సెలవు. హాయిగా చదువుకొని ఆనందించండి.

మీ
**బేతవోలు రామబ్రహ్మం**

బొమ్మూరు-533124
27-7-1995

## తాయిలం

మనసుని ఆకట్టుకోవడానికి
చిన్నవాడికి తాయిలం
పెద్దవాడికి తాంబూలం

ఆకర్షణకు చిన్నవాడికి తాయిలం
ఆశీర్వదించడానికి పెద్దవార్కి తాంబూలం

ఈ తాంబూల సంప్రదాయం
స్వార్థప్రయోజనం కన్నా
సామాజిక కల్యాణానికి
దోహదపడడానికి ఈ రచన
మంగళకారి కావాలని ఆశిస్తూ

నరసాపురం, **గోటేటి రాధాకృష్ణ**
27-6-1995

## పథ్యం

ఒక వైద్యుడు వ్యక్తికి గల రుగ్మతలను బట్టి నివారించగలడు. ఒక ఉపాధ్యాయుడు కొంతమంది విద్యార్థులకు రుగ్మతలను నివారించేందుకు ప్రయత్నిస్తాడు. కవి మొత్తం సమాజంలోని రుగ్మతలను నివారించేందుకు ప్రయత్నిస్తాడు. ఉపాధ్యాయుడే కవియైతే ఆబాలగోపాలాన్నీ కూడా సంస్కరిస్తాడు. ఆ సంస్కరణకు దోహదపడేదే తాంబూలం ఖండకావ్యం. ఇది కేవలం మిఠాయి కిళ్లీ అనుకోకండి. కాస్త ఘాటుగాకూడా ఉంటుంది.

బాలింత పథ్యంలా పనిచేస్తుంది.

**కవికొండల రామచంద్రరావు**

నరసాపురం,
1-7-1995.

# ముందుగా ఒకమాట

ఒకరోజున అనుకోకుండా మా ఇంటికి వచ్చాడు మోపిదేవి భాస్కరరావు. తనతో బాటు తన భార్య విజయలక్ష్మినికూడా తీసికొనివచ్చాడు. వారి అమ్మాయి జిగీష వివాహానికి స్వయంగా శుభలేఖ ఇచ్చి, పిలిచేందుకు. 'జిగీష' ఎంత ముచ్చటైన పేరు పెట్టాడనిపించింది. అంతేమటి. మా గురువుగారైన బ్రహ్మశ్రీ రావూరి వేంకటేశ్వరులవారికి ప్రత్యక్షశిష్యుడు. పైగా అవధాని. ప్రభుత్వపాఠశాలలో తెలుగు పండితునిగా, ప్రధానోపాధ్యాయునిగా, మండలవిద్యాశాఖాధికారిగా ఉద్యోగనిర్వహణ చేస్తున్నవాడు. మా ఇద్దరిదీ మూడు దశాబ్దాల స్నేహబంధం. సరే వారితోబాటు ఎస్.టి.పి రఘురామ్, ఉమాదేవి దంపతులుకూడా వచ్చారు. వీరిద్దరూ సంస్కృతాంధ్రభాషలలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు. పెండ్లి పిలుపులు అయిన తరువాత రఘురామ్ గారు ఒకమాట అన్నారు. మేము వీరితోబాటు ప్రత్యేకంగా వచ్చింది ఒకటి మిమ్మల్ని చూడాలని, అంతే కాదు, మీ తాంబూలం పుస్తకాలు పదో ఇరవైయో తీసికొందామని అన్నారు. అంతేకాదు 20 ఏళ్ళగా మీ తాంబూలంలో పద్యాలు నా విద్యార్థులందరికీ కంఠస్థంగా వచ్చేలా చేస్తున్నాను. ఇప్పటికి కనీసం రెండువేలమందికి తాంబూలం మొత్తం కంఠగతంగా వచ్చు. కాని పుస్తకంమాత్రం నా దగ్గర ఒక్కటే ఉంది అనికూడా అన్నారు. చాల ఆశ్చర్యపోయాను. ఎపుడో1995లో వ్రాసిన నా ఈ చిఱుకృతిని ఇంతగా ప్రేమిస్తున్నారే! అని. కాని ఇవ్వడానికి పదో ఇరవైయో కాదుగదా! కనీసం ఒక్కటికూడా లేదు. నా సొంతకాపీని మాత్రం భద్రంగా దాచుకొన్నాను అని వారికి చూపించాను. వెంటనే భాస్కరరావు అందుకొని, ఒక పని చేద్దాం. మా అమ్మాయి పెండ్లికానుకగా ఈ కృతిని పునర్ముద్రించి, జిజ్ఞాసువులకు అందచేద్దాం. ముద్రణకు అయ్యే ఖర్చు తనకు విడిచిపెట్టి వెంటనే రంగంలోకి దిగమన్నాడు. చాల సంతోషం కలిగింది నాకు.

నిజంగానే కేవలం 50 పద్యాలతో మాత్రమే సరదాగా ఆనాడు వ్రాసిన ఈ చిన్నారి కృతి తాంబూలాన్ని ఆనాడే సాహితీ ప్రియులు ఎంతగానో ఆదరించారు. రెండుమూడు నెలలలోనే 1000 కాపీలు అయిపోయాయి. ఇంకా కావాలని ఎందరో అడిగారు. పునర్ముద్రణ చేయాలని అనుకుంటూనే ఉన్నాను. అలాగే ఇరవై సంవత్సరాలు గడిచిపోయాయి. ఎప్పటికప్పుడు ఏదో క్రొత్త రచన చేయడం, దానిని ముద్రించడంపైనే ఆసక్తిని కనబరచడం కారణంగా ఇది వెనుకబడిపోయింది. ఇదుగో ఈ నాడు నా మిత్రుడు మోపిదేవి భాస్కరరావు ప్రోత్సాహంతో ఆ కార్యం నెరవేరింది. రెండవ ముద్రణకు నోచుకుంది.

చాలా సంతోషం. ఆనాడు ఈ కృతిని తన తల్లిదండ్రులకు అంకితం చేయించుకొని అచ్చువేయించిన నరసాపురం హెూమియో వైద్యులు శిరిగినీడి నాగభూషణంగారికి, పునర్ముద్రణ చేయిస్తున్న మోపిదేవి భాస్కరరావు దంపతులకు, అసలు ఈ ఆలోచన కలిగేవిధంగా ప్రేరణనిచ్చిన రఘురామ్ దంపతులకు, పెండ్లిరోజైన జనవరి 22వ తేదీనాటికే అందంగా ముద్రించి అందించిన క్రియేటివ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ నరసాపురంవారికి, ముఖ్యంగా ఆనాడు తాంబూల రచనకు నన్ను ప్రోత్సహించిన నా మిత్రులు, ప్రస్తుత ప్రధానోపాధ్యాయులు ఘంటా సుబ్బారావుగారికి, మొదటి ముద్రణకు అభిప్రాయాలందించిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి, గోటేటి రాధాకృష్ణగారికి, కవికొండల రామచంద్రరావుగారికి, అలాగే ఆనాడు ముఖచిత్రాన్ని అందించిన నాటి నర్సాపురం మున్సిపల్ కమీషనర్ వి. రాజేంద్రప్రసాద్‌గారికి, విశేషించి, నా యీ తాంబూలాన్ని ఆదరించి, రెండవ ముద్రణకు కారకులైన సాహితీ రిరంసువులకు ఆనందంగా కృతజ్ఞతలను ప్రకటిస్తున్నాను.

ఇప్పుడే గృహస్థాశ్రమ స్వీకారం చేస్తున్న జిగీష పృథ్వీరెడ్డి దంపతులకు ఆశీరభినందనలు అందిస్తున్నాను.

**కడిమిళ్ళ వరప్రసాద్**

1. లడ్డూ మిఠాయిలన్ లంచమిచ్చిన గాని
మూడేండ్ల బుజ్జాయి బువ్వ తినడు
చిల్లరతిండికై చేతిబత్తెము నీక
బుద్ధిగా అఆలు దిద్దుకొనడు
క్రొత్త బట్టలనిచ్చి కోర్కె తీర్చిన గాని
ముద్దుగా బొత్తమ్ము ముట్టుకొనడు
అరచేతియందు చక్కెర నించినసె గాని
అప్పుడప్పుడు తలనంటికొనడు
వేగునంతకు గ్రుక్కెడు వేడిపాలు
రాత్రి నిదురింప గమ్మని లాలిపాట
కాన్క వెట్టనిదే రోజు గడువదాయె
శైశవమునుండి మాది లంచాలజాతి॥

(శైశవము= పసితనము)

2. మోదకమ్ములనిచ్చి మ్రొక్కువారికి గాని
విఘ్నముల్ బాపని వేల్పొకండు
తలనీలములనిచ్చి దర్శించినసె గాని
వరమీని పెద్ద దైవమ్మొకండు
నూరు బిందెల నీటిధార పోసినగాని
భూతినీకుండెడి ప్రోడ యొకడు
పానకమ్మును సమర్పణము సేసినగాని
చల్లగా జూడని శాంతుడొకడు
సృష్టికర్తలే యీరీతి జెలగునాడు
కానుకలకోసమై జూచు కాలమందు
ఔరసులమైన మాకు సృష్ట్యాదినుండి
సంప్రదాయము మాది లంచాలజాతి॥

3. తాళి కట్టినదాది తరుణి సౌఖ్యము కోరి
శ్రమకోర్చి సొమ్ము నార్జనము సేయు
పక్షానకొక్క పర్వమ్ము వచ్చినగాని
పట్టుబట్టలు తెచ్చిపెట్టుచుండు
మారిన ప్రతి సినీమాకు దోడ్కొనిపోవు
యంత్రవాహనము నాయత్తపరచు
దూరదర్శనమును దోచుబాటునకిచ్చు
ఆకాశవాణి సాయమునకిచ్చు
ఇన్ని చేసియు వెల కొంత ఎక్కువనుచు
ఒక్క మాపున పూలు తేకుండెనేని
ముచ్చటలు మానుకొని పెడమోము పెట్టు
ఆలి తప్పేమి! మాది లంచాలజాతి॥

4. సుతుడు లేకున్నచో గతులు లేవనుమాట
నరనరమ్ములయందు నాటుకొనగ
తరుణి లేకున్న సంతానాప్తి కాలంబ
నము లేని మాట చిత్తమున నిలిపి
కామోపభోగేచ్ఛ కరడు గట్టుట జేసి
వయసుపోరునకు నోపంగలేక
తనకింత సుఖమిచ్చి తనను దండ్రిని జేయు
ఇల్లాలికై లోకమెల్ల వెదకి
తుదకు షట్కర్మయుక్తగా దోచినట్టి
అబలనొకతెను జూచి పెండ్లాడ దలచి
ఎంత కట్నమ్ము నిచ్చెదవే యటన్న
పాలిపోనేల! మాది లంచాలజాతి॥

(ప్రతిసినీమా అనేది సాధుసమాసము కాదు. లోకవ్యవహార అనుకరణము.)

5. పదిమాసములు మోసి ప్రసవించి పాలిచ్చి
తనయులన్ సాకిన తల్లిగాని
పుట్టినప్పటినుండి యెట్టి యిక్కట్టు లే
కుండ గాచిన జనకుండు గాని
తన బిడ్డ వయసింత యని చెప్పగారాదు
వారి పల్కులు చెల్లుబాటు గావు
శంఖాన బడి తీర్థజలమౌను బుట్టిన
దినము ప్రభుత్వమే తెలుపవలయు
అట్టి ధ్రువపత్రమందంగ నందు నందు
ఎన్ని చేతులు తడిపిన నెన్ని నాండ్లు
పట్టునో యేమొ తెలియంగ బ్రహ్మతరమె
యేల జెప్పగ! మాది లంచాలజాతి॥

6. విద్యలన్ నేర్పింప వీథిబడులయందు
చేర్పించుటకు నందు సీట్లు కొఱత
మంచి మార్కులు వచ్చు మాబిడ్డకే పాఠ
శాలాప్రవేశమ్ము జరుగకున్న
ఎవ్వారికింక లభించును లెమ్మంచు
ధైర్యమ్ముతో దల్లిదండ్రులుండ
కడకు మార్కులు రాని వెడగునకే చోటు
దొరుకుటం జూచి, యబ్బురమునంది
పోయి యాజమాన్యమువద్ద మొఱలు పెట్టి
కొంత తాంబూలమర్పించుకొన్న పిదప
అనుమతించిరటన్న జోద్యంబటంచు
ఏల వగచెదు! మాది లంచాలజాతి॥

7. పదనైన మతిగల్గువాడహెూరాత్రముల్
క్షణము విశ్రాంతి లేకయ పఠించు
నూటికేబదిగాని దాటి యర్వదిగాని
యార్జించుటన్న బ్రహ్మాండమాయె
సమ్మెల లూటీల దొమ్మీ ఘెరావుల
అల్లర్లతో సమయమ్ము గడిపి
పొత్తమ్మునే ముట్టబోని విద్యార్థికి
ఎనుబది తగ్గిన జాడలేదు
ఏమిరా! ఇన్ని యెట్లు లభించెననిన
సమయమెఱిగినవాడు రక్షకభటుండు
వలయు కాపీల నందింప గలిగెననిన
ఏల తడబాటు! మాది లంచాలజాతి॥

8. ఉండియో కాక లేకుండియో యిచ్చె రూ
కలను తెక్కలను ముక్కలుగ జేసి
తన భావిజీవితోద్యాన కల్పకశాఖి
బిడ్డ విద్దియ యన్న వెఱ్ఱిచేత
పట్టభద్రుండైన పట్టి రెట్టించిన
యుత్సాహమంది యుద్యోగమంద
పని జూపుడయ్య త్రోవను జూపుడయ్య భా
విని జూపుడయ్య నాకనుచు దిరుగ
అరిగిపోవును జెప్పులు తరుగు జేబు
మొదట లేదు పొమ్మనుచుంద్రు పిదప వారె
కనికరము మాని వయసు మీఱినది యంద్రు
జాలి మాకేల మాది లంచాలజాతి॥

9. గారాల కొమరిత కల్యాణ ఘడియకు
కట్నకాన్కలకు బైకమ్ము దెచ్చి
ఉన్న యొక్క కుమారుడుద్యోగి యౌటకై
తాంబూలములకు విత్తమ్ము దెచ్చి
రోగాల పుట్టయై రొప్పు నిల్లాలి మం
దులకు వైద్యులకు బైసలను దెచ్చి
పరువు మర్యాదలే స్థిరమంచు నాతిథ్య
గౌరవమ్ములకు రొక్కమ్ము దెచ్చి
కడకు వడ్డీల లెక్క రక్కసిగ బెరుగ
పొలము నమ్మిన దీరె నప్పులు సగమ్మె
అమ్మిపెట్టిన యట్టి పుణ్యాత్ము కఱవు
సొంతముగ దీరె! మాది లంచాలజాతి॥

10. ఇరుగయ్యతో సాటి పొరుగయ్యతో బాటు
సరిగంగ తానాలు సలుపబోక
పంచభక్ష్యాలకో పరమాన్నములకొ యా
శలు లేక చద్దితో చాలివడుచు
కడుపు నింపగ తిండి, యొడలు గప్పగ బట్ట
చాలంచు దలచి, దర్జాలు విడిచి
వ్యసనమ్ములకు బోక, పైమెఱుంగులు లేక
చెమట విత్తమ్ముగా జేసికొనుచు
అద్దెకొంపల యగచాట్ల కలసిపోయి
సొంత కొంపను గట్టుకో జూచెనేని
ప్రభుత యనుమతి రాదు సంభావనములు
చాలకుండిన! మాది లంచాలజాతి॥

11. మితి గల్గినట్టి సంతతి గాంచుటయె మేలు
మితభాషణాభ్యాస గతులు మేలు
మితిలేని సేవకు మిత వేతనము మేలు
మితము గల్గిన మైత్రి మిగుల మేలు
మితిలేని విద్యార్థి తతులున్న బడులందు
పరిమిత గురుసంఖ్య కరము మేలు
వాగ్దానముల పరంపరలు వర్షించినన్
పరిమితమ్మగు క్రియా సరణి మేలు
ఇందునందున నంచు వచింపనేల
ఎందునేనియు మితము పాటింపవలయు
కాని మామూళ్ళ లెక్క తగ్గంగరాదు
చాల తప్పది! మాది లంచాలజాతి॥

12. దసరాకు మామూలు దండిగా నీకున్న
విద్యుత్తు దీపాలు వెల్గబోవు
సమయమ్మునకు నుత్తరములందగాబోవు
టెలిఫోను డబ్బాలు పలుకబోవు
నీరనాళికనుండి నీటిచుక్కలు రావు
గోల వెట్టినను జీతాలు రావు
పంటకాలువ నీరు ప్రవహింప నేరదు
తీరుగా వస్త్రముల్ తెలుపు రావు
ధర్మవైద్యాలయాల వైద్యములు గాని
రక్షకభటాళి వలని భద్రతలు గాని
మచ్చునకు గూడ గనరాని అచ్చమైన
చరిత గల జాతి! మాది లంచాలజాతి॥

13. ఆశుకవిత్వమ్ము నలవోకగా జెప్పి
వాడవాడల బేరు వడయు గాత
భాషాపయోరాశి పారమ్ము దర్శించి
పండితుండని పేరు వడయు గాత
శిల్పసంపదలను బొల్పొందగా నిల్పి
కవిరాజుగా వాసి గాంచు గాత
సద్విమర్శలు సమీక్షలు వ్రాసి వైమర్శ
కాగ్రేసరఖ్యాతి నందుగాత
జనుల నాల్కలపై నివాసమ్ము గొనిన
అందునందున సత్కృతులందుకొనిన
రూక లేకున్న నరుడవార్డులను గొనుట
సాధ్యమే గాదు! మాది లంచాలజాతి॥

14. స్వార్థమ్ము విడనాడి జాతి బాగోగులే
తనకు బెన్నిధియంచు దలచి తలచి
తిండి తిప్పలు మాని దేశమ్మునకు మంచి
తెలుపంగ బలుమార్లు తిరిగి తిరిగి
కఱవు పొంచినగాని, వఱద ముంచినగాని
నడుము గట్టుక ముందు నడచి నడచి
అంటురోగాలతో నల్లాడు దీనుల
సేవలో నిలువెల్ల జివికి చివికి
మిగులువానినీ భువియెల్ల మెచ్చుకొనియు
ఎన్నికలయందు మాత్రమోడించి దింపు
వోటు కొనలేని దౌర్భాగ్యుడౌట జేసి
చరిత గలజాతి! మాది లంచాలజాతి॥

(యకారంబును వువూ వొవోలును తెలుగు మాటలకు మొదట లేవని బాలవ్యాకరణము. కాని వోటు అనేది ఆంగ్లపదం)

15. గద్దెనెక్కినదాది గడియించుటే గాని
జనసేవ సేసిన క్షణము లేదు
వర్షించుటయె గాని వాగ్దానములు పనుల్
కావించినది యొక్క గడియ లేదు
పథకప్రచారముల్ వ్యాపించుటయె గాని
అమలుపెట్టిన దినమ్మైన లేదు
శాంతిభద్రతల రక్షణమంటయే గాని
హత్యలాగినది రేయైన లేదు
అట్లు గాడేని మంచివాడయ్యేనేని
తెలివిమాలినవాడెన్నికలకు మరల
ఎట్టి యిక్కట్టు పడిన టిక్కట్టు రాదు
చరిత గలజాతి! మాది లంచాలజాతి॥

16. సత్యవ్రతాచార సంపత్తి గలవారి
నాలుకల్ తెగగోసి నడచువారు
ధర్మవ్రతాచార తాత్పర్యశీలుర
నెంచి కుత్తుకలుత్తరించువారు
న్యాయవ్రతాచార నైష్ఠిక ప్రవరుల
బట్టి సంపద కొల్లగొట్టువారు
శాంత్యహింసా వ్రతాచరణ సమ్రాట్టుల
జీవచ్ఛవాలుగా జేయువారు
పట్టుబడబోరు రక్షకభటులచేత
పట్టువడినను శిక్షలు పడుట కల్ల
సాక్ష్యములు తారుమారౌచు సాగుచుంట
సహజగుణమిది! మాది లంచాలజాతి॥

(హత్య అనే ప్రయోగాన్ని పండితులు అంగీకరించరు. కాని లోకంలో బహుళవ్యాప్తిని పొందినది గనుక స్వీకరించుట జరిగినది.)

17. దేశసౌభాగ్యమ్ము తీర్చి దిద్దెడివాడు
దేశికుండనుటకు దిరుగులేదు
ప్రగతికే భాష్యమ్ము పల్కు పతంజలి
ఒజ్జయే యంట యత్యుక్తి గాదు
భావి భారతదేశ పౌరకోటికి స్రష్ట
గురుడంట కాదనుకొనగరాదు
ఘనకీర్తి గల దేశ గరిమనాభియ యుపా
ధ్యాయుడన్ వాసి పొమ్మన్న పోదు
జాతి నిర్ణేతకై తగు జీతములను
ప్రభుత దైవతమ్మొచు నేర్పఱచుగాని
నడిమి పూజారులరులు చేముడుపులందు
చరిత గలజాతి! మాది లంచాలజాతి॥

18. హర్మ్యమ్ములాకాశమంటునంటయె గాని
గుడిసెలోపలి పేద గోడు వినము
కడలియా! యది రత్నగర్భ యంటయె గాని
జాలర్ల దారిద్ర్యహేల గనము
వాయుయానము నెంచి పలుకుటే గాని రి
క్షా చోదకునిపైని జాలి గొనము
ఔన్నత్యమును మెచ్చుటగు గాని తన విధి
వెక్కిరించినవారి వెంట జనము
ఎట్టకేలకు బ్రభుత గుర్తించి తగిన
ఋణము కల్పించి, దారిద్ర్యరేఖ తుడువ
రూకలిచ్చిన అవి దరిద్రుల కరాల
రాలబోవట! మాది లంచాలజాతి!!

19. పొరుగూళ్ళకై వార్త పోయిరావలెనన్న
వార్తాహరుండు పోవలసియుండె
పారావతమ్ములే వార్తాహరములైన
నాగరకత కొన్నినాళ్ళకబ్బె
అది పోయి లేఖ ప్రయాణమ్ము కనుపట్టె
కమ్మలందింప వేగమ్ము హెచ్చె
అదిపోయి ఇదిపోయి అతిదూరవాసితో
స్వయముగా భాషింప వలనుపడియె
దూరభారమ్ము తొలగించె దూరవాణి
అయ్యు ననుమతియే పెద్ద యాగమయ్యె
ఏళ్ళు పూళ్ళైను వారికర్పించు ముడుపు
చాలివడకున్న! మాది లంచాలజాతి॥

(ఈ రచన 1995నాటిది. ల్యాండ్‌ఫోను పెట్టుకోవడంలో ఆనాటి పరిస్థితి ఇది. ఇప్పుడా పరిస్థితి లేదు. ఎందుకంటే ఇప్పుడు సెల్‌ఫోను రాజ్యమేలుతోంది)

20. ఏరండదీపాల సౌరు గేహాళిపైని
కొడిగట్టు రోజులు కొడినిగట్టె
మృత్తైలదీప సంపత్తి గోడలు వట్టి
మసిపట్టు రోజులు మాసిపోయె
నిర్వర్తికలు నేటి నీటిదివ్వెలు వేయి
చందమామలకు మచ్చరము దెచ్చు
క్షణమాగినను బ్రతిష్టంభనమ్మైపోవు
విద్యున్మయమ్మాయె విశ్వమెల్ల
విద్యుదంగన మనయింట విడిది సేయ
పడుపుకత్తె దళారీల వైనమాయె
ఊహకందని అనధికారోపహార
శాంతి గావలె! మాది లంచాలజాతి॥

(ఏరండదీపము = ఆముదపు దీపము. మృత్తైలదీపము = కిరసనాయిలు దీపము. నీటిదివ్వెలు = విద్యుత్తు దీపాలు;)

21. వరద గాదగిన యాపగ దాను బగబూని
వఱదగా మారి యుప్పరమునంటి
ఎన్ని కొంపలు ముంచి, యెంతమందిని జంపి
యానందతాండవమ్మాడియాడి
జిగి తగ్గనో లేక బిగి కగ్గనో కాక
సమధికోత్సాహమ్ము చచ్చుబడునా!
ఆత్మహత్యార్థమై యబ్ధిలో బడి వెఱ్ఱి
వెఱ్ఱిగా నేడ్చి యూపిరిని విడుచు
బ్రదుకమిగిలినవారు జీవచ్ఛవాలు
ప్రభుత సహకారములు పెద్దవారిపాలు
నోరు గలవారు మా రెవిన్యూ జనాలు
జాలియే లేదు! మాది లంచాలజాతి॥

( వరద = వరములను ఇచ్చేది. వఱద = నదికాని ఏరుకాని పొంగుట. ఇటువంటిచోట శకటరేఫ(ఱ) అవసరం తెలుస్తుంది. మనం క్రొత్తగా ఒక్క అక్షరాన్ని సృష్టించలేము కాని, పెద్దలు సృష్టించి ఇచ్చిన అక్షరాలలో కొన్ని అవసరం లేదనుకోవడం తెలుగు భాషకు పట్టిన దుర్గతి. )

22. కడుపు కాలెడువాడు గంజినీటికి బోర
గొంతు నొక్కగలట్టి హంత నేను
నోట్ల కట్టను గొట్టి వోట్ల కట్టను బట్టు
వానికై జైకొట్టు వంత నేను
అబల యెవ్వతెయేని నర్ధరాత్రములందు
నగుపింప జెఱచు నియంత నేను
ఇన్ని నేరములున్న నే చట్టమునకేని
వీలు చిక్కని పెద్ద వింత నేను
ఖండఖండాంతరాలలో ఖ్యాతి గొన్న
తేనె పూసిన కత్తిని నేనె నేను
బలము కలిగినవారు కప్పములు గొనుట
జన్మహక్కది! మాది లంచాలజాతి॥

(జన్మహక్కు అనేది దుష్టసమాసమనే భ్రాంతిని కలిగిస్తుంది. కాని మిశ్రమసమాసం. సాధుప్రయోగమే)

23. కోకిలా పంచమ కూజితమ్ముల మించు
రకరకమ్ముల కూతలకు ఘనుండు
మల్లికా సుమహేల మధురసౌరభ లీల
మించు మద్యమ్ము సేవించు ఘనుడు
కుసుమాస్త్ర శరములన్ గుంఠితమ్ములొనర్చు
పలుకు ముల్కులతోడ గులుకు ఘనుడు
మధ్యందినమునాటి మార్తాండునకు మించి
తీక్ష్ణదృక్కులతోడ దిరుగు ఘనుడు
ప్రకృతి శక్తులన్ వంచించి బ్రదుకువాడు
నేటి మానవుడన్నట్టి నిజము తెలిసి
మెచ్చుకొనరేల! బహుమతులిచ్చికొనగ
సంశయమ్మేల! మాది లంచాలజాతి॥

24. ఉత్తరంబీకున్న నుద్యోగమొక్కటి
మనకు దక్కునటన్న మాట కల్ల
ఉత్తరంబొకటియే యుద్యోగమీదు ద్ర
వ్యంబు లేకుండ ఔపడుట కల్ల
ఏ యుపాయాన సాధించుకొంటివొ గాని
యేపాటి సుఖము నార్జించినావు
విధినిర్వహణమందు విశ్రాంతి లేకయే
పని చేసినను మెప్పు వడయలేవు
ప్రతిభ కలిగియు దగు క్వాలిఫైడువయ్యు
జాగు లేకుండగా బ్రమోషనులు రావు
గడ్డి మఱిగిన పై యధికారి నిన్ను
సరకు గొనడయ్య! మాది లంచాలజాతి॥

25. బీడువారిన నేల గోడు తీర్చుటకునై
యుద్భవించినది యీ యుర్వియందు
పిడుచకట్టెడి నాల్క వెతను బాపుటకునై
అవతరించినది యీ యవనియందు
కడుపులోపలి మూషకముల నిర్మూలింప
జన్మమెత్తినది యీ జగతియందు
వడగొట్టి పడిపోవు బడుగుజీవుల గావ
తారసిల్లినది యీ ధాత్రియందు
దేవుడిచ్చిన యీ నీటితీరువాకు
పన్ను గట్టించుకొను ప్రభుత్వమ్ము మాది
పన్నుతోబాటు పైవారి పంటిక్రింద
చాల పడవలె! మాది లంచాలజాతి॥

26. కలమెత్తెనా మహాకావ్యరాజమ్ములు
క్షణములో వ్రాసెడి జాతిమాది
గొంతెత్తెనా ఆతి గుండెలన్ గరగించి
జాలువారించెడి జాతిమాది
హలమెత్తెనా మంటి పొలములో బంగారు
జాలువా పండించు జాతిమాది
పదమెత్తెనా స్కందవాహనమ్మునకీసు
జనియింపజేసెడి జాతిమాది
ఉలిని బట్టిన గిరులేని తలలు వంచి
సాగిలంబడజేసిన జాతిమాది
చాలివడిలేని యుదరపోషణమునందు
శ్రద్ధ గలజాతి! మాది లంచాలజాతి॥

27. నిలువుటద్దము ముందు నిలబడి నీ యంద
మును జూచుకొని నీవె మురిసిపోవా!
పిల్లకాలువ నీద వెనుకాడనట్టి నీ
శక్తికి నీవె యాశ్చర్యపోవా!
స్నానాలగదియందు కూనిరాగము తీయు
నీ గానశక్తి వర్ణించుకోవా!
ఒకనాడు నీ పద్యమొక్క పత్రిక ప్రచు
రించినం జాలు వెఱ్ఱెత్తిపోవా!
అవును నీ పిచ్చి యానందమగును నీకు
పరుల యానందమునకడ్డుపడెదవేల?
గడ్డి మేయుటలో దృష్టి గలదు మాకు
ఏలికలనీతి! మాది లంచాలజాతి॥

28. ఒండురూకకె కిలో తిండిగింజలొసంగు
తెల్లకార్డులనెల్ల దీసివైచు
ధరను తగ్గించి శర్కర నొసంగుదురు మా
సాలు దాటినను కోటాలు రావు
వన రక్షణార్థమై వాయువింధనమయ్యె
బ్లాకు సాగుట దక్క స్టాకు రాదు
మోటారు వాహనమ్ములపైని జనువారి
క్యూలుండుగాని పెట్రోలు రాదు
వానలెక్కువై వఱదలు వచ్చుగాని
వత్తి దీపాలు దక్క విద్యుత్తు రాదు
సాగుబడి కల్లు దొరలకు సమయమునకు
జరుగునన్నియు మాది లంచాలజాతి॥

29. అంగళ్ళ రతనాల నమ్మిన చోటనే
తిండిగింజలుకూడ నిండుకొనియె
అగ్రహారాధిపత్యము గల్గుచోటనే
తలదాచుకొనుచోటు కలుగదాయె
పట్టుబట్టల నగ్గిపెట్టె నిల్పినచోట
మూరెడు గుడ్డయే పుట్టదాయె
పాతాళగంగనే పైకి దెచ్చినచోట
దోసిళ్ళలో నీళ్ళు దొరకవాయె
అతిజనాభాయె కారణంబనుట నిజము
తగిన సమయమ్ములో నియంత్రణము జరుగ
క్లర్కులింక్రిమెంట్లీరు రొక్కము కరాల
రాలకుండిన! మాది లంచాలజాతి॥

30. కాశికావిశ్వేశు కనులార వీక్షింప
పాదచారమ్ము తప్పకయ పోయె
సమయమ్ము విలువాయె జాప్యమ్ము కఱవాయె
పొగబండిపైననే పోవుటాయె
దూరభావన డిగ్గె దూరభారము తగ్గె
కుదుపెరుంగక జోగి కునుకుటాయె
పరుపుటుయ్యేలపై పవ్వళించినయట్లు
తెలవారుదాక నిద్రించుటాయె
ఇన్ని సౌఖ్యాలు కలిగియు నేమి సుఖము
ఎంత వేడిన బెర్తు లభించదాయె
అచట టీటీఇ గడ్డిమేయంగ నోరు
చాపుచుండును! మాది లంచాలజాతి॥

31. పాదయాత్రలనాటి ప్రాతకాలము దాటి
శ్రమదీర్ప తైలయానములు వచ్చె
నగరమ్ములను బట్టణములందె గాదాయె
పల్లె పల్లెకు నేడు బస్సు వచ్చె
లగ్జరీ బస్సు డీలక్సు బస్సును వచ్చె
కాలమ్ము తగ్గె సౌఖ్యమ్ము హెచ్చె
బహుదూరతీరమ్ము పయనింప గోరుచో
సీట్ల కేటాయింపు చేత వచ్చె
కాని చిల్లర లేక యెక్కంగ రాదు
ఎక్కిననుగాని తిరిగి పృచ్ఛింపరాదు
మనకు టిక్కట్టు కండక్టరునకు మటుకు
చాలు చిల్లర! మాది లంచాలజాతి॥

32. మిట్టపల్లాలైన మట్టిబాటలనుండి
ఎఱ్ఱకంకరబాట కెదిగినారు
ఎఱ్ఱకంకరపైని నిస్సురుస్సులు పోయి
నల్లకంకరపైని నడచినారు
నల్లకంకరపైని నడువ బొబ్బలు రేగ
తారుపూతలు పూసి తరలినారు
తారు వేడిమి తాకి యేరౌట గాంచి సి
మ్మెంటు బాటలపై గమించినారు
చిత్తు చిత్తైనచో మరమ్మత్తు లేదు
నోట్లు కోట్లైనగాని మన్నుటయు లేదు
లక్షలెదురీనినాడు కాంట్రాక్టు రాదు
జాడ్యమియ్యది! మాది లంచాలజాతి॥

33. పాదచారము సేసి పయనింపగారాదు
కాలమ్మునందు వేగమ్ము హెచ్చె
మైళ్ళకు మైళ్ళు సైకిళ్ళు త్రొక్కగరాదు
పిక్కలందు బలమ్ము స్రుక్కజొచ్చె
కార్లెక్కగా పడిగాపులు పడరాదు
పిల్లతల్లులు సొమ్మసిల్లవచ్చు
పొగబండి మేలంచు పొరబాటు పడరాదు
నిలుచుంటకై కాళ్ళు నీల్గవచ్చు
స్వేచ్ఛగా బోవ స్కూటరే శ్రేష్ఠమయ్యె
ఒడుపుగా ద్రోలగల చోదకుడవె యయ్యు
ఇపుడు డ్రైవింగు లైసన్సు లిచ్చునట్టి
జనులు బ్రోకర్లు! మాది లంచాలజాతి॥

34. ఒకరికి దలవంచి యుండు దుర్గతియేల
పరుల సేవించెడి బ్రదుకులేల
ఆత్మాభిమానమ్ము నమ్మజూడగనేల
సేవకస్థితినంది జివుకనేల
మడిదున్నుకొనియైన కుడువంగ మేలునా
సామెత కాలదోషమ్ము గాంచె
నేలమూల్యము నేడు నింగి యంచులు దాటి
సాగె, యుద్యోగమే చవకయయ్యె
కొంత చెల్లించి బడియందు బంతులయ్యు
మొక్కు దీరకయున్న అప్రువలు గాదు
వారు జిల్లాకు విద్యాధికారిగారు
జాతి పురుషులు! మాది లంచాలజాతి॥

35. నేలతల్లికిగూడ నిలుకడ లేదాయె
పద్మినీపతి చుట్టువార దిరుగు
చలివెలుంగునకేని నిలుకడ లేదాయె
భూమాతతో సాగిపోవుచుండు
విలువైన కాలమే నిలుకడ కోల్పోయి
క్షణకాలమేని యాగక గమించు
నీటికుప్పనిసుంగు నిలుకడ యేపాటి
జగతిమూలమ్మయ్యు చంచలించు
అందుకేనేమొ! అదియె తత్త్వార్థమేమొ!
నీతి తప్పక యుద్యోగ నిర్వహణము
సలుపువారల బదిలీల సాగనంపి
సత్కరింతురు! మాది లంచాలజాతి॥
(నీటికుప్ప= సముద్రము. నీటికుప్పనిసుంగు= సముద్రుని కుమార్తె లక్ష్మి)

36. పగలెల్ల గష్టించి పనిచేసి వచ్చెడి
శ్రమజీవి సుంత విశ్రాంతి నంద
కార్యాలయములందు గడగండ్లు చవిచూచు
బుద్ధిజీవి యొకింత మోదమంద
బేరసారమ్ములన్ విసిగి వేసారెడు
సార్థవాహుడు మనశ్శాంతినంద
ప్రొద్దెల్ల బొత్తంపు పురుగౌచు మసలెడి
విద్యార్థి కొంత వైవిధ్యమంద
చలనచిత్రాలు కల్పవృక్షాలు నేడు
కాని టిక్కెట్ల కెన్ని యిక్కట్లు మనకు
కొంత హెచ్చించి బ్లాకులో కొనకయున్న
సాధ్యమే కాదు! మాది లంచాలజాతి॥
(సార్థవాహుడు= వ్యాపారి)

37. గ్రామాధికారి రొక్కమ్ము ముట్టినగాని
పంచాయితీలలో బనులు గావు
పట్టణమ్ములయందు బడు పాట్లకంతేమి
నరభుక్కులు కమీషనరులు గలరు
నగరంబులందెన్ని యగచాట్లు పశ్యతో
హరులైనవారు మేయర్లు గలరు
జిల్లాను మొత్తమ్ము జేబులో బడవేయ
గల సమర్థులు కలక్టరులు గలరు
మొదల రాష్ట్రమ్మునకు నొక్క ముఖ్యమంత్రి
పైని దేశమ్మునేలు ప్రధానమంత్రి
ఇందరున్నారు కన్నీళులింకకుండ
శ్రద్ధ గొనువారు! మాది లంచాలజాతి॥

38. తన నియోజకవర్గమునకున్న ఘనకీర్తి
వెలకట్టబడు నసెంబ్లీలయందు
తన నియోజకవర్గమునకున్న పరువడు
గంటిపోవును పార్లమెంటునందు
జిల్లాకు మున్నున్న చేవ సొంతము స్రుక్కి
పరిషత్తు ఛైర్మన్ల పాలబడును
ఒకశాఖలో బూర్వమున్నట్టి సత్తువ
చెఱపోయి మంత్రి కుర్చీకి దగులు
ఉండునే వారి నౌకర్లకున్న విలువ
ఉండునే వారి డ్రైవర్లకున్న విలువ
ఉండునే దళారీగాండ్రకున్న విలువ
జనులకుండునే! మాది లంచాలజాతి॥

39. కల్హారపతి కాంతి కాన్క వెట్టనినాడు
పంటనీకున్నదే పంటవలతి
సూర్యకాంతి యొకింత సోకకుండిననాడు
వెన్నెల యొకిమీదు వెలుగకుండె
సాగరమ్మొక యింత జలమీక యంబుద
శ్రేణి యొక్కింత వర్షింపకుండె
నదులెల్ల దమ చుంబనములీక సాగరుం
డుదధరమ్ముల కంబువొసగకుండె
ప్రకృతి మొత్తమ్ము కాన్కలవలన నడచు
ప్రకృతి నడపింప నడచెడు బడుగు నరుడు
కాన్కలను వీడి బ్రదుకంగ గలడటయ్య!
జన్మహక్కది! మాది లంచాలజాతి॥
(ఉద ధరములు= మేఘములు. అంబువు=నీరు)

40. ధర్మమ్ము నాల్గుపాదమ్ములన్ నడపించు
మునికోటి నెల్ల గొప్పలను బట్టి
క్రతువులన్ గాలమ్ము గడపుచుండెడి సోమ
యాజికోటిని గొంతులదిమిపట్టి
వేదాధ్యయనముతో విశ్వశాంతికి బాదు
చేయు భూసురకోటి సిగలు వట్టి
పరమపాతివ్రత్య భరమైన నీరీమ
తల్లికా కోటి మొత్తమ్ము వట్టి
మసలుకొన్నది కఱకు రక్కసుల జాతి
అడుగునడుగున గొంత ద్రవ్యమ్ము విదుప
శాంతియుతముగా పనులెల్ల చక్కబరచు
జాతి నరులది! మాది లంచాలజాతి॥

41. కలవారు, కలవారి కడచూపునకు మ్రొక్క
గలవారు, బ్రదుకంగ గలుగువారు
తినువారు, తినువారి మునివ్రేళ్ళ విదుపు మ్రె
క్కినవారు, స్వేచ్ఛగా మనెడివారు
కొనువారు, కొనువారి కొసరు వడ్డనలు చే
కొనువారు, తృప్తి గైకొనెడివారు
ఇడువారలిడువారి కెడదలేకుండ దా
రిడువారు మానమ్ము చెడినవారు
చెలగి దేశసంపదను దోచిన జనాలు
చిన్ని బొజ్జకు కోట్లు నోచిన జనాలు
చీడతిండికి మోము వాచిన జనాలు
ఏలికలు మాకు! మాది లంచాలజాతి॥

42. తన బిడ్డ బ్రదుకు నందనము సేయగ గళా
శాలకేగిన ప్రిన్సుపాలు గాని
చౌకడిపో కార్డు గైకొంటకొఱకు పా
దములంట తహసీలుదారుగాని
నిరుపయోగంబైన నేలపై యింటి ప
ట్టా గోరుటకు కలెక్టరునుగాని
నట్టింట నిల్చి తాండవమాడు జ్యేష్ఠను
సాగనంపగ మినిష్టరును గాని
స్వయముగా బోయి కలియంగ సాధ్యపడదు
లోనికేగగనీరు బంట్రోతువారు
ఒడుపుగా వారి చేతులు తడుపుకొనుచు
సాగవలయును! మాది లంచాలజాతి॥

43. ఏడాది కొక్కరో యిద్దరో ముగ్గురో
నలుగురో ముఖ్యమంత్రులుగ నుంద్రు
నెల యుండునో రెండు నెలలుండునో మంత్రి
పదవి నిర్ధారింప బ్రహ్మతరమె
వారముండునొ రెండువారమ్ములో శాఖ
లెన్నిమారులు మారునెవరికెఱుక
దినముందురో యర్ధదినముందురో వారు
పార్టీకి నమ్మిన బంటులగుచు
పాలకులకేలనో స్థిరత్వమ్ము లేదు
కప్పలకు గెంతులను నేర్పగలుగువారు
స్థిరత భూమికే లేదు, శాసించు భూమి
పాలకులకేల! మాది లంచాలజాతి॥

44 పసివయస్సునయందు బలపమ్ము చేబట్టి
అక్కరమ్ములు దిద్ది యలసి సొలసి
బాలుడై పొత్తముల్ పట్టి రేబవలు పా
ఠమ్ములు వేలు కంఠస్థపఱచి
ఆపై గళాశాలయందు బాదమునుంచి
శాస్త్రాలతో బోరు సలిపి సలిపి
స్నాతకోత్తర విద్య సాధించుటకు విమ
ర్శగ్రంథకోటులన్ జదివి చదివి
క్రొత్తవిషయమ్ములను కనుగొనుచు సంఘ
సేవ జేయబూనిన ప్రొఫెసెర్లనుండి
సీటు దక్కుట కల్ల దక్షిణ కరాల
రాలకుండిన! మాది లంచాలజాతి॥

45. బాల్యమ్మునుండి విద్వల్లోకసంస్తుతి
గాంచునట్లుగ విద్య గఱచి కఱచి
నీతియున్ నియమమున్ నిలువెల్ల నిండించి
పలు పరీక్షలు నీవు వ్రాసి వ్రాసి
మంచి మార్కులను సాధించుచున్ బంగారు
పతకముల్ పెక్కింటి బడసి పడసి
పత్రికల్ ప్రకటించు ప్రకటనమ్ముల గాంచి
పలు ధరఖాస్తులు పంపి పంపి
ఎదురుచూటుటతోడనే యేండ్లు గడిచి
విసిగినంగాని నీకొక్క పిలుపు రాదు
మేలిముడుపుల ఎంప్లాయిమెంటువారి
జోలె నిండక! మాది లంచాలజాతి॥

46. విధియ దైవతమంచు విశ్వసించుట దక్క
విశ్రాంతి గోరిన వేళ లేదు
సమయపాలనతోడ సాగిపోవుట దక్క
జాగు చేసినదొక్క క్షణము లేదు
చీటికిన్ మాటికిన్ జిలిపి కారణముతో
జిక్కించుకొన్నట్టి సెలవు లేదు
పనిభారమెంతగా కనులముందటనున్న
పనిమాలి తీసిన కునుకు లేదు
ఘనులకెన్నడు నెదిరి పల్కినది లేదు
చెడినవారికి దలను వంచినది లేదు
ఇంత చేసియు దనకు గుర్తింపు లేదు
జన్మకిక రాదు! మాది లంచాలజాతి॥

47. నెలలు దాటిన జీతములు రావు, పస్తులు
పడుట యుద్యోగి జీవనపు సరణి
ఏండ్లు దాటినగాని ఇంక్రిమెంట్లీరు, నో
రెత్తకుండుటయె జీవించు విధము
ఎదురుచూపులు దక్క ఎరియర్లు దక్కవు
వాకొనకుండుటే బ్రతుకుతెరువు
అతికాలమునకిచ్చు నట్టి మూల్యము రాదు
సహనమే జీవనోత్సవము నిజము
బల్లక్రిందికే చేతులు పరువులెత్తు
బల్లపై పనికిక దీరుబడియు గలదె
సార్వభౌములు గద గుమాస్తాలు నేడు
జరుగుబాటది! మాది లంచాలజాతి॥

48. బాల్యమ్మునుండి యౌవనము వచ్చెడునంత
దనుక జీవితము పొత్తమ్ములయ్యె
పెద్ద పట్టా వచ్చి పిన్న నౌకరు జేసె
వయసెల్ల నుద్యోగభారమయ్యె
వృత్తికంకితమైన చిత్తమ్ముతో, నెత్తు
టినిగూడ స్వేదవాహినిగ మార్చె
అలసిపోయినవేళ నాతనిం గుర్తించి
విశ్రాంతి యనుపేర వెడలగొట్టు
తిరుగునే గాని, తన చెప్పులరుగు గాని
కనులు వాచును ముదిమి రొక్కమ్ము రాదు
ఎన్ని చేతులు తడిపుచు నేగి యేగి
సోలవలయునో! మాది లంచాలజాతి॥

49. పుట్టినా! యతగాడు పుట్టుట సత్యమే
అని ధ్రువపత్రమ్ము నందవలయు
తలిదండ్రులకు గల్గు కులమె వీనిదికూడ
అని ధ్రువపత్రమ్ము నందవలయు
పూట చెల్లని వాని పాటు సాలునకింత
అని ధ్రువపత్రమ్ము నందవలయు
గిట్టినా! యతగాడు గిట్టుట సత్యమే
అని ధ్రువపత్రమ్ము నందవలయు
అట్టి పత్రమ్ము లందుట యాగమాయె
యాగఫలదాతలకు బెద్ద భోగమాయె
లోకమందెల్ల నేడిది రోగమాయె
చరిత గలజాతి! మాది లంచాలజాతి॥

50. పుట్టినప్పుడు కష్టములు వేలు కల్గుటూ
హించునో యేమొ! రోదించుచుండు
బాల్యమ్ములో పెద్దవారి యాజ్ఞప్తుల
కిమడగాలేక దుఃఖించుచుండు
వయసులో సంసార బాధాపయోరాశి
నీదగా లేక కృశించుచుండు
ముదిమిలో బిడ్డల విదిలింపులకు గ్రుంగి
స్వేచ్ఛార్థియౌచు దపించుచుండు
జీవయాత్రను దానింక జేయలేక
కాయమును వీడి గాలిలో గలియునాడు
వల్లకాటిలో గాటికాపరియు జేయి
చాపుచున్నాడు! మాది లంచాలజాతి॥



# నాదొక పద్యకుటుంబం

నాదొక పద్యకుటుంబము
కాదనువారెవరు సుతులు కాంతయు గవితా
కేదారమ్మున నిరతో
త్పాదనమును జేయుచుండ బద్యఫలమ్ముల్॥

తాతకు లేదు కవిత్వము
నా తండ్రికిగూడ లేదు నాకే యబ్బెన్
నాతోడనె యాగదులే
నా తనయులకబ్బె నాదు నారికి నబ్బెన్॥

జడమతులు గారు శ్రుతులం
దుడుపతులే యెదిరి నిల్చు నుగ్రుని దలపై
దడబడక నిలుచువారే
కడిమిళ్ళాన్వయమునందు గవినాద్యుడనే॥

నా వదనమ్ము కావ్య సదనమ్ము రసమ్మట పాకశాల స
ద్భావనలే గదుల్ నుడులు ద్వారము లార్ద్రగభీర తత్త్వమే
బావి, పవిత్ర శాస్త్రముల వాకిట పద్యము రంగవల్లియై
పావనులైనవారలకు స్వాగతముల్ వచియించు నెప్పుడున్॥

– కడిమిళ్ళ



# మా
# 'మోపిదేవి'

శ్రీ భాస్కరరావు - శ్రీమతి విజయలక్ష్మి

మోపిదేవి కులాంభోధి పూర్ణచంద్ర!
భాస్కరాహ్వయా! నీ కవిత్వమ్మునందు
అక్షరాక్షరమందున అక్షరముగ
వెల్లి విరియును గావుత విజయలక్ష్మి॥

ఖ్యాతము మోపిదేవి కులమంబరమందు వియన్మణిత్వ వి
ఖ్యాతుడు భాస్కరుండతని యక్షరకాంతికెడంద తమ్మికిన్
జేతన కల్గుచుండు వికసించుచునుండు మరందధారతో
బూతము చేయు సత్కవనభూమి నతండు శుభంబు గాంచుతన్॥

పలుకు పలుకులో దేనియలొలుకుచుండు
మానవత్వమ్ము గుండెలో మసలుచుండు
స్నేహశీలమ్ము సతము పోషించుచుండు
భద్ర మోపిదేవ్యన్వయ భాస్కరుండు॥

పద్యకవితా జీవి
నవరసమ్ముల బావి
పలుకు తేనెల దీవి
మా మోపిదేవి॥



డా. కడిమిళ్ళ



పద్యమ్ము నెవడురా! పాతిపెట్టెదనంచు
ఉన్మాదియై ప్రేలుచున్నవాడు
పద్మమ్మునెవడురా! ప్రాతవడ్డదియంచు
వెఱ్ఱివాడై విఱ్ఱవీగువాడు
పద్యమ్ము ఫలమురా! పాతిపెట్టిన బెద్ద
వృక్షమై పండ్లు వేవేల నొసగు
పద్యమ్ము నెప్పుడో పాతిపెట్టితిమేము
లోకుల హృదయాల లోతులందు
ఇప్పుడద్దాని బెకలింప నెవరితరము
వెలికి తీసి పాతుట యెంత వెఱ్ఱితనము
నిన్నటికి మున్ను మొన్ననే కన్ను దెఱచు
బాల్యచాపల్యమునకెంత వదఱుతనము॥

డా॥ కడిమిళ్ళ

క్రియేటివ్ 08814273113